



# పిల్లల పాటలు

## ( రెండవ భాగం )







ఎర్రోజు సత్యం







శ్రీనివాస పబ్లికేషన్స్
రాచర్ల బొప్పాపూర్-505 305.





# పిల్లల పాటలు

( రెండవ భాగం )










## ఎర్రోజు సత్యం





శ్రీనివాస పబ్లికేషన్స్

రాచర్ల బొప్పాపూర్-505 305.

ఫిబ్రవరి 1982

వెల : 2-00



ముద్రణ :

విష్ణు ప్రింటింగ్ ప్రెస్
సిరిసిల్ల—505 301

ప్రతులకు :

ఎరోజు సత్యం రాచర్లబొప్పాపూర్-505 305
తాలూకా సిరిసిల్ల జిల్లా కరీంనగర్

హైద్రాబాద్ బుక్ బ్యూరో
అమీర్‌పేటరోడ్స్, హైదరాబాద్-500873

కొండ వీరయ్య సన్స్
పుస్తకముల వ్యాపారము
హైదరాబాద్, సిద్దంబర్ బజార్

* ఇతర పుస్తకముల దుకాణముల నుండియు పొందవచ్చును

# అంకితం

పద్మశ్రీ, కళాప్రపూర్ణ

**డా॥ సి. నారాయణరెడ్డి**

అధ్యక్షులు అధికార భాషా సంఘం ఆంధ్రప్రదేశ్ గారికి

(జానపద శైలిలో గేయం)

నారాయణరెడ్డి
శ్రీ నారాయణరెడ్డి
సినిమా పాటలు రాసే
సి. నారాయణరెడ్డి :నారాయణ:
పట్నంలో పెద్దబడిలో
పెద్ద సదువు జెప్తారు
మదురాసు కెళ్తారు
సినిమ పాటలు రాస్తారు :నారాయణ:
చిన్నోళ్ళు మీ పాటకు చిందులేస్తుంటారు
వయసోల్లు మీ పాట్లకు 'వహ్వా' అని అంటారు
ముసలోళ్లు మీ పాటకు మురిసిపోతుంటారు
ప్రతిఒక్కరు మీపాటకు పరవశించి పోతారు
:నారాయణ:

సన్నమామిడి కొమ్మమీద
వెన్నలాంటి పాటరాసి
ఎన్నెన్నో నీతులను
చిన్నోళ్ళకు జెప్పితివి. :నారాయణ:

పగలే వెన్నెల అను పాటను రాసితివయ్యా
పడుసోళ్ల గుండెల్లో దాచి ఉంచితివయ్యా
మంచివి సమాధి అను పాటను రాసితివయ్యా
మంచి మంచి ముసలోళ్ళ మెప్పును పొందితివయ్యా
:నారాయణ:

మీ మాటలు వింటుంటే తీపిదిన్నట్లుంటది
మీరు పాటలు పాడితె మేల్కొల్పినట్లుంటది
మీ పద్యాలు జదువుతుంటె మనసు పొంగి
పోతుంటది
అన్నింటిలో మీకు మీరే సాటి అని తోస్తుంటది.
:నారాయణ:

అనుమాఁపేటకు తిలలాంటివారు మీరు
ఆ ఊరికె కాదు
ఈ దేశానికె తోట మీరు
మల్లె తోట మీరు :నారాయణ:

ఎంతెంతొ మంచి మనసు మీకు ఉన్నదయ్యా
ఎర్రోజు సత్తెము మాటను కాదనకయ్యా
మల్లెలాంటి మనిషివని పిల్లల పాటలు రాసి
మీకంకిత మిస్తున్నా తీసుకొమ్మంటున్న
:నారాయణ:

—ఎర్రోజు సత్యం



# స్వీకృతి

ఉత్సాహానికి మరో పేరు ఎర్రోజు సత్యం. ఆ ఉత్సాహం నిత్యజీవితంలోనే కాక కవిత్వంలో—ముఖ్యంగా పాటల్లో తరంగలెత్తడం మెచ్చుకోదగ్గ విషయం. పిల్లల పాటలనూ, జానపద శైలిలో గీతాలనూ వ్రాయడంలో సత్యం చక్కని సాధనలో ఉన్నాడు.

అలాంటి సాధకుడు, ఔత్సాహిక కవితా యాత్రికుడు అంకితమిస్తున్న ఈ పాటల సంపుటిని ఆనందంగా, ఆశీఃపూర్వకంగా స్వీకరిస్తున్నాను.

—డా॥ సి. నారాయణరెడ్డి

# సందేశం

బాల సాహిత్యానికి రచయితగా తగిన విధంగా తోడ్పడుచున్న శ్రీ ఎర్రోజు సత్యం (టీచర్) గారిని మనసారా అభినందిస్తున్నాను.

ఇంతకు ముందు వీరు పిల్లల పాటలు మొదటి భాగం, బాలలోకం పుస్తకాల్ని అచ్చువేయించి అందరి మెప్పు నందుకున్నారు. ఇప్పుడు ఈ పిల్లల పాటల (రెండవ భాగం) కావ్యాన్ని పద్మశ్రీ, కళాప్రపూర్ణ డా॥ సి. నారాయణరెడ్డి అధికార భాషా సంఘం అధ్యక్షులు గారు అంకితం తీసుకోవడం ఆనందించవలసిన విషయం.

నీతిని బోధించే ఈ పుస్తకాల్ని విద్యార్థులకు అందజేయడానికై తగిన ప్రయత్నాలు చేసిన శ్రీ యస్. వెంకటరెడ్డి అధ్యక్షులు పంచాయితి సమితి సిరిసిల్ల గారు, శ్రీ ఆర్. పాపారావు అధ్యక్షులు పంచాయతి సమితి వేములవాడ గారు, ఉపాధ్యాయులు, గ్రామస్థులు అందరు ప్రశంసనీయులు.

శ్రీ సత్యంగారి రచనలకు ముందు ముందు కూడా అందరి అండదండలు, ఆశీస్సులు లభించాలని హృదయ పూర్వకంగా ఆశిస్తూ వీరు ఇంకా ఎన్నో రచనలు చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

పి. కిషన్ రావు
అధ్యక్షులు
జిల్లా పరిషత్తు-కరీంనగరం

# అభిప్రాయం

పి. కమలేశ్వరరావు
జిల్లా కలెక్టర్, కరీంనగర్

బాల సాహిత్యాభివృద్ధికి శ్రీ ఎర్రోజు సత్యంగారు రచయితగా చేస్తున్న కృషి ప్రశంసనీయమైనది. వీరి కృషికి అందరి అండదండలు ఆశీస్సులు ఉండడం మెచ్చుకోదగిన విషయం.

వీరిదివరలో పిల్లల పాటలు మొదటి భాగం, బాలలోకం పుస్తకాల్ని అచ్చువేయించి సహృదయుల మెప్పునందుకున్నారు. ఇప్పుడు ఈ పిల్లల పాటలు (రెండవ భాగం) కావ్యాన్ని అధికార భాషా సంఘం అధ్యక్షులు పద్మశ్రీ, కళాప్రపూర్ణ డా॥ సి. నారాయణరెడ్డిగారు అంకితం తీసుకోవడం మెచ్చుకోదగిన విషయం.

ఈ పిల్లల పాటలు రెండవ భాగం పుస్తకాల్ని విద్యార్థులకు అందజేయడానికై తగిన విధంగా సహకరించిన శ్రీ ఆర్. పాపారావు అధ్యక్షులు పంచాయితి సమితి వేములవాడ గారు, శ్రీ ఎన్. వెంకటరెడ్డి అధ్యక్షులు పంచాయితి సమితి సిరిసిల్లగారు, గౌరవనీయులైన ఉపాధ్యాయులు, గ్రామస్థులు అందరు అభినందనీయులు.

బాల సాహిత్యానికి శ్రీ ఎర్రోజు సత్యంగారు చేస్తున్న కృషిని మనసారా అభినందిస్తూ వీరు ఇంకా ఎన్నో ఉత్తమ రచనల్ని చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

శ్రీ వాగీశ్వర్యై నమః

# పీఠిక

## 'అభినవ పోతన'

### విద్యావాచస్పతి డా. వానమామలై వరదాచార్యులు

శ్రీ యెర్రోజు సత్యం బాలల సాహిత్య నిర్మాతయై ఆంధ్ర వాఙ్మయమునకు గణనీయమైన సేవ చేస్తున్నాడనడంలో అతిశయోక్తి లేదు.

ఈయన ఇదివరలో "బాలలోకం", "పిల్లల పాటలు" మొదటి భాగం వ్రాసి ప్రకటించి సహృదయ కవిపండిత ప్రశంసలనందుకొన్నాడు. శ్రీ. సత్యం ప్రస్తుతం "పిల్లల పాటలు" రెండవ భాగము రచించి ప్రకటించినారు. ఇందలి ప్రతి శీర్షికా పిల్లల ఉజ్వల భవిష్యత్తునకుకారకమై ఒప్పారుతూ ఉన్నది. ఇందలి భాష భావం సరళాతి సరళమై సులభగ్రాహ్యమై బాలురందరికీ అందుబాటులో ఉంటి వారిని భావిభారతానికి ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దడానికి ఎంతో ఉపయోగపడుతున్నదనడంలో సందేహం లేదు.

ఈ చిన్ని గ్రంథంతో వినోదంతోపాటు విజ్ఞానాన్ని బాలురకు కలిగించడంలో ఈయన కృతకృత్యుడైనాడు ఇందుకు నిదర్శనంగా ఈ కృతిలోని ఒకటీరెండు మచ్చుతునకలను ఉదహరించడం నా విధి.

పిల్లవాణ్ణి ఉత్తమ విద్యావంతునిగా గుణవంతునిగా తీర్చిదిద్దడంలో తలిదండ్రుల గురువుల పాత్ర యెంతైనా అవసర

మైంది. "మాతృమాన్, పితృమాన్, ఆఛార్యమాన్ పురుషోవేద'' అనిగూడా బలంగా దీన్ని సమర్థిస్తూ ఉన్నది. అందుకే వీరిపట్ల ఆదరం గల్గి ఉండాలెనని ఉద్బోధిస్తున్నది. "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ'' అని పై ముగ్గురిని ప్రత్యక్ష దేవతలుగా భావించుమంటున్నది. అది పిల్లలకు తెలిసేమాదిరిగా మన సత్యకవి చక్కగా గ్రంథాదిలోనే చెప్పినాడు. ''జన్మను ఇచ్చి చల్లగపెంచే తల్లిదండ్రులకు జేజేలు, విద్యను చెప్పి బుద్ధులునేర్పే గురువుగారికి జేజేలు'' అని పిల్లలకు వీరు ముగ్గురు ప్రాతస్మరణీయులు వందనీయులు అని చక్కగా బోధించినాడు. ఈ ముగ్గురిపట్ల భక్తిభావం గల్గి వీరు చెప్పినట్లు బాలుడు నడచుకుంటే వాని భవిష్యత్తు ప్రగతి పథంలో పయనిస్తుందని అందరికీ తెల్సినదే.

7వ శీర్షికలో మనిషి పుట్టినది ఎందులకు అని ప్రశ్నించుకొని మంచిని పెంచేటందుకని ఆ మంచి సకల మానవులు సుఖపడేటట్లు చేస్తుందని ఇట్లందరు మంచివారై లోకకళ్యాణం కొరకు దేవుని ప్రార్థించి ప్రయత్నిస్తుంటారని మంచితనపు ఫలితాలన్ని కలశాబ్ధిని కలశంలో నింపినట్లు ప్రవచించినాడు కవి. అల్పపదాలలో అనల్పార్థాన్ని నింపి ఉత్తమ కవి యనిపించుకొన్నాడు.

పిల్లల నవ్వించే పద్ధతిలో కొన్ని వినోదకరమైన శీర్షికలను గూడా రచించినాడు సత్యం ''బొఅ్రిబావ'' అనే శీర్షికలో నవ్విస్తూనే నీవాకతవే బొఅ్రిబెంచితే చాలదు. కూడూగూడూలేని నీతోటి మానవులకు విలువనీడనిచ్చి దరికిదీయాలెననే ఉపదేశాన్ని బాలురతో వ్యంగ్య ధోరణిలో పలికించి పెద్దవారికిగూడా బుద్ధిచెప్పినాడు సత్యం.

ఇంతేకాక పొడుపు కథలవంటి ఒక శీర్షిక రచించి కోడిగాని

కోడి ఏది? మాటగాని మాట ఏది? అని పకోడీ టమాటా అంటూ చెప్పి పిల్లలలో వినోదాత్మకమైన ఒక విచారణా సరళికి బాటవేసినారు. "పిల్లలం పిల్లలం కల్లకపటమెరుగని తెల్లనైన మల్లెలం" అని ఏరోజు సత్యస్వరూపులై వెల్గే పిల్లల ఉల్లం ఎరోజు సత్యం గారు సారూప్యం దాల్చి చక్కగా గ్రహించినారేమో యన్నట్లు ఈ గ్రంథములో పిల్లల మనస్తత్వానికి అనుకూలంగా అతి సులభ మధురంగా ఉపదేశం చేసినారు. ఈ కృతి సి. నారాయణరెడ్డిగారికి అంకితంగా ఇవ్వడం చాలా సముచితమైన విషయం.

వీరు ఇతోధికంగా కృషి చేసి బాల సాహిత్యం మనకు చాలినంతా లేదనే అపవాదు తీరిపోవునట్లు అనేక కృతులను వెలయించి ఆంధ్రి భాషాయోషనలంకరింతురు గాత! ఇందుల వీరికి బాలల దీవనలు బ్రహ్మదీవనలై ఆయురారోగ్య భాగ్యాలు ప్రసాదించాలె.

IX

# కోరిక

'బాలబంధు'
ఇల్లిందల సరస్వతీదేవి

బాల సాహిత్యంలో శైశవ దశలో కథలకంటె అధిక ప్రాధాన్యత కలవి గేయాలు. కథలు పిల్లలు విని ఆనందిస్తారు. కాని-గేయాలు పాడుకుంటారు ఒకరుగాని-ఇద్దరుగాని-సామూహికంగా గాని పాడుకోవడానికి వీలయిన గేయాలు చిన్న చిన్న పదాలతో లయ బద్ధంగా ఉండేవంటే పిల్లలెంతో ఇష్టపడతారు.

మాటలు రాని పిల్లలు కూడా ఏవేవో రాగాలు తీస్తూ ఉంటారు. అటువంటి పిల్లలకు చిన్నచిన్న పదాలతో గేయాలను కూర్చితే వాటిని అభ్యసింపజేయటం సులభంగా ఉంటుంది.

బాల సాహిత్యం కాగితమ్మీదికెక్కకముందు వాఙ్మహిత్యంగా ఉండేదేమొ! "చందమామ రావే జాబిల్లి రావే" "కాళ్ళా గజ్జా కంకాళమ్మా" వంటి పాటలు కోకొల్లలు. ఎప్పటినుంచో అమ్మలూ, అమ్మమ్మలూ, బామ్మలూ పిల్లలను దగ్గర కూర్చోబెట్టుకొని పాడుతూ పాడిస్తూ ఉండేవారు. "చిన్న చెంబుతో నీళ్ళు, సీకాయ ఉదకంబు" అన్నది పిల్లలను ఏమార్చటానికి రచించింది. పిల్లలు తలంటు పోసుకునేటప్పుడు ఏడవకుండా చిన్న చెంబుతో నీళ్ళు చేతికిస్తే పోసుకుంటూ ఉంటారు. ఈలోపల తల్లి సీకాయతో తల రుద్దేస్తుంది.

పిల్లల పాటలలో గేయాలలో ఆయుర్వేద వైద్యమున్నదని కీ శే రామానుజస్వామి ఆయుర్వేద వైద్యులు అంటూ ఉండేవారు

"కాళ్ళాగజ్జి కంకాళమ్మా" గేయము దానికి సంబంధించినదే. అలాగే "కొండమీద కొక్కిరాజు" గేయంకూడాను. ఆంగ్లభాషలో నర్సరీరైమ్సులో "రింగ రింగ రోజెస్" అన్న గేయము ప్లేగు వంటి ఒక వ్యాధిని గురించినది.

శ్రీ ఎర్రోజు సత్యంగారు వృత్తిరీత్యా ఉపాధ్యాయులు కనుక పిల్లలకు నేర్పవలసిన సుద్దులన్నీ గేయరూపంలో రచించారు. పిల్లలనోట పలికించి పులకిస్తున్నారు. ఉపాధ్యాయులకిది అదనపు సౌకర్యము.

పాఠశాలల్లో పిల్లలకు దశలవారిగా బోధించవలసిన నీతులను రీతులను చక్కటి గేయాలలో సందర్భోచితంగా రెండు సంపుటాలుగా రచించి అచ్చువేసిన శ్రీ ఎర్రోజు సత్యంగారు ధన్యులు.

సత్యంగారూ! మీరిటువంటి గేయ సంపుటాలు అనేకంగా రచించి బాలల ఎకాడమీ నుండి "బాలబంధు" అవార్డు పొందాలని ఆకాంక్షిస్తున్నాను.

# అభినందన

శ్రీ యన్. కిష్టయ్య
తహసిల్దార్, సిరిసిల్ల.

శ్రీ ఎరోజు సత్యంగారు రచించిన పిల్లల పాటలు రెండవ భాగం పుస్తకాన్ని చదివాను. దీనిలోని పాటలు చాలా బాగున్నాయి. ప్రతి పాట ద్వారా పిల్లలకు పనికివచ్చే నీతిని బోధించటం జరిగింది. పిల్లల పలుకుబడిని పట్టుకొని వారికర్థమయ్యే విధంగా సులభమైన శైలిలో రచించడం మెచ్చుకోదగిన విషయం సత్యంగారు నవలలు, నాటికలు, గేయాలు, వచన కవితలు, జానపద శైలిలో గేయాలు మొదలైనవెన్నో రచించారు వాటిని అచ్చు వేయించే ప్రయత్నంలో ఉన్నారు.

మనకు బాలసాహిత్యం తగినంతగా లేదన్న ఉద్దేశ్యముతో శ్రీ సత్యంగారు బాలసాహిత్యం వైపు ఎక్కువగా శ్రద్ధ చూపిస్తూ రెండు మూడు పుస్తకాలను రచించి అచ్చు వేయించారు. ఈ విధంగా బాల సాహిత్యానికి వీరు చేస్తున్న కృషిని మనసారా అభినందిస్తున్నాను. వీరి కృషికి తోడ్పడుచున్న ప్రతి ఒక్కరు ప్రశంసనీయులు.

ఈ పుస్తకం కళాప్రపూర్ణ, పద్మశ్రీ డా॥ సి. నారాయణ రెడ్డిగారికి అంకితంగా ఇవ్వడం సముచితంగా ఉంది. శ్రీ సత్యంగారు శ్రీ నారాయణరెడ్డి గురించి జానపదశైలిలో వ్రాసిన గేయం చాలా బాగుంది. ఈ గేయం గురించి కొద్దిగా చెప్పాలని ఉంది.

1980వ సంవత్సరం నవంబరు నెలలో ఆంధ్ర ప్రదేశ్

అవతరణ రజతోత్సవముల సందర్భమును పురస్కరించుకొని అప్పటి కలెక్టర్‌గారైన శ్రీ కె. యస్. శర్మగారు కరీంనగర్‌లో భారీఎత్తున సాంస్కృతిక కార్యక్రమాలు జరిపించారు. అదే సందర్భమున శ్రీ సి. నారాయణరెడ్డిగారిని, శ్రీ వానమామలై వరదాచార్యులు గారిని, శ్రీ జె. బాపురెడ్డిగారిని, శ్రీ బోయి భీమన్న గారిని, జిల్లాలోని కవులందరిని ఆహ్వానించి కవి సమ్మేళనము ఏర్పాటు చేయించారు. ఆనాటి కవి సమ్మేళనములో శ్రీ ఎర్రోజు సత్యంగారు రచించి శ్రీ కె.యస్. శర్మ జిల్లా కలెక్టర్ కరీంనగర్ గారికి అంకితమిచ్చిన "బాలలోకం" పుస్తకం ఆవిష్కరణోత్సవము జరిగింది. ఆ తర్వాత జరిగిన కవి సమ్మేళనములో శ్రీ సి. నారాయణరెడ్డిగారి గురించి శ్రీ సత్యంగారు ఈ పుస్తకంలోని జానపదశైలిలో రచించిన గేయాన్ని ఎంతో చక్కగా చదివి అందరి మెప్పునందుకున్నారు.

శ్రీ ఎర్రోజు సత్య గారు ఎంత చక్కగా కవిత్వం వ్రాయగలరో అంత చక్కగా చదివి శ్రోతల్ని పరవశింపజేయగలరు. ఇది మెచ్చుకోదగిన విషయం.

శ్రీ సత్యంగారు ఇంకా ఎన్నో ఉత్తమ రచనల్ని చేస్తూ ఆంధ్రసాహిత్యానికి తోడ్పడాలని ఆకాంక్షిస్తున్నాను.

# విషయ సూచిక

# ముందు మాటలు

మన రాష్ట్రంలో బాల సాహిత్యం చాలినంత లేదు. రచయితగా ఈ లోటును కొద్దిలో కొద్దిగానైనా తీర్చాలన్న సదుద్దేశ్యము నాకు కలిగింది. ఆ ఉద్దేశంతో నేను రచించిన నవలల్నిగాని, లలిత సంగీతం గేయాల్నిగాని, వచన కవితల్ని గాని అచ్చు చేయించకుండ ముందుగా పిల్లల పాటల్ని అచ్చు చేయించాలని ప్రయత్నించాను నాప్రియత్నాన్ని అభినందిస్తూ అనేకమంది పెద్దలు పిన్నలు బంధు మిత్రులు, ఉపాధ్యాయ సోదరులు ఆర్థికంగా, హార్దికంగా ప్రోత్సహించడం చేత 1978 లో " పిల్లల పాటలు '' మొదటి భాగం పుస్తకాన్ని అచ్చు చేయించాను. ఆ పుస్తకం అందరి అభిమానాన్ని పొంది ఆరు నెలలలోనే రెండవ ముద్రణకు నోచుకొని ముచ్చటగా మూడవ ముద్రణలోకి అడుగిడబోతుంది.

1980 వ సంవత్సరంలో సహృదయులు, సాహిత్యాభిమానులైన శ్రీ కె. యస్. శర్మ జిల్లా కలెక్టర్ కరీంనగర్ గారు నేను రచించిన బాల గేయాల్ని చూసి సంతోషించి గేయాలకు తగిన విధంగా బొమ్మల్ని వేయించి "బాలలోకం'' పుస్తకాన్ని అచ్చు చేయించి బాలలోకానికి అందించారు. ఆ పుస్తకం అనుకున్నదాని కన్న ఎక్కువగా పలువురి మెప్పును పొంది రెండవ ముద్రణలోకి అడుగిడబోతుంది.

ఈ పిల్లల పాటలు రెండవ భాగం పుస్తకం గురించి సహృదయులు, సాహిత్యాభిమానులైన శ్రీ యన్. వెంకటరెడ్డి అధ్యక్షులు పంచాయతి సమితి సిరిసిల్ల గారు శ్రీ ఆర్. పాపారావు అధ్యక్షులు పంచాయతి సమితి వేములవాడ గారు ఎంతగానో సహ

కరించారు. పుస్తకం యొక్క వెల ప్రకారం విద్యార్థుల నుండి ముందుగనే డబ్బు వసూలు చేయడానికి తగిన ప్రయత్నాలుచేశారు. అందుకు గౌరవనీయులైన ఉపాధ్యాయులు గ్రామస్థులు సహృదయంతో సహకరించారు ఈ పుస్తకం అచ్చు విషయంలో డైరెక్టర్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ ఆంధ్రప్రదేశ్ హైద్రాబాద్ గారు కూడా ఆర్థికంగా సహకరించారు. బాల సాహిత్యంపై ఇంత మందికి ఇంతగా శ్రద్ధాసక్తులు ఉండడం అభినందించాల్సిన విషయం. ఈ పుస్తకం అచ్చు విషయంలో ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన ప్రతి ఒక్కరికి కృతజ్ఞతాభివందనములు.

బాలసాహిత్యానికి జానపద సాహిత్యానికి చాలా దగ్గరి సంబంధమున్నది. అందుకని పద్మశ్రీ డా. సి. నారాయణరెడ్డి గారి గురించి జానపద శైలిలో గేయాన్ని రచించడం జరిగింది. పోతే ఈ గేయం ఎందరి మెప్పునో అందుకుంది, అందుకే అంకింతం రూపంలో అందరిముందుకు రాగలిగింది. అభిమానాన్ని మన్నించి అంకిత స్వీకారానికి అంగీకరించిన అమృత హృదయములు పద్మశ్రీ డా. సి. నారాయణరెడ్డి గారికి హృదయపూర్వక కృతాజ్ఞతాంజలులు.

పిల్లలకు హాస్యమంటే చాలా ఇష్టంకనుక "ఉల్లిగడ్డంత" "బొర్రిబావ" అను రెండు పాటల్ని హాస్యధోరణిలో రచించాను. ఈ కృతిలోని ప్రతి పాట ద్వారా నీతిని బోధించడానికి ప్రయత్నించాను. ఈ పాటలు పిల్లలకు ఏమాత్రం పనికి వచ్చినా నా రచనా ధ్యేయం నెరవేరినట్లే, అక్కడక్కడా కొన్ని అచ్చు తప్పులు దొర్లినాయి. పెద్దలు వాటిని సవరిస్తూ పిల్లలకు చెప్పగలరని ఆశిస్తున్నాను.

కోరినంతనే ఈ కృతికి ఎంతో శ్రద్ధాసక్తులతో తమ అమూల్యమైన అభిప్రాయాల్ని అందించిన శ్రీ పి. కమలేశ్వర

రావు జిల్లా కలెక్టర్ కరీంనగర్ గారికి, శ్రీ పి. కిషన్‌రావు అధ్య క్షులు జిల్లా పరిషత్తు కరీంనగరం గారికి, విద్యా వాచస్పతి డా. వానమామలై వరదాచార్యులు గారికి, "బాలబంధు" ఇల్లిందల సరస్వతీదేవి గారికి, శ్రీ యన్. కిష్టయ్య తహసిల్దారు సిరిసిల్ల గారికి, వేవేల జేజేలు. పుస్తకాన్ని అందంగా అచ్చువేసి ఇచ్చిన విష్ణు ప్రింటింగ్ ప్రెస్ సిరిసిల్లకు పంచాయితి సమితి వేముల వాడకు పంచాయితి సమితి సిరిసిల్లకు కృతజ్ఞతలు.

సహృదయంతో నన్ను ప్రోత్సహిస్తూ నా రచనల్ని అభి నందిస్తూ తమ అమూల్యమైన ఆశీస్సులను, అండదండలను అంది స్తున్న పద్మశ్రీ డా. సి. నారాయణరెడ్డి, 'అభినవపోతన' డా. వానమామలై వరదాచార్యులు, శ్రీ జె. బాపురెడ్డి, శ్రీ కనపర్తి శ్రీ యన్. వెంకటరెడ్డి శ్రీ వి. వెంకటరెడ్డి శ్రీ పి వెంకటాచారి శ్రీ రుద్రి శంకరయ్య, శ్రీ జి. భూమయ్య, శ్రీ జె. నర్సింగరావు శ్రీ వి. మోహన్‌రెడ్డి, శ్రీ ఆర్. పాపారావు, శ్రీ పి. మాధవరెడ్డి శ్రీ యం. రాజిరెడ్డి, శ్రీ యం. కొండలారావు, శ్రీ యం. నర్సింగ రావు శ్రీ పి. నర్సింహారెడ్డి, శ్రీ యం. రఘుపతిరావు, శ్రీ విష్ణు ప్రసాదరావు, శ్రీ కుడిక్యాల లింగయ్య, శ్రీ జక్కని వెంకటరాజం శ్రీ యన్ కిష్టయ్య, శ్రీ తుమ్మనపల్లి ఆనందం, ఉపాధ్యాయ సోదరులకు, గ్రామ సర్పంచులకు, బంధుమిత్రులకు ఎందరో ఇంకెందరో అందరి పేర్లు వ్రాయలేను ఎవ్వరిని మరచిపోను వీరందరికి నా హృదయపూర్వక నమస్సులు.

సత్ప్రవర్తనతో చక్కని రచనాశక్తితో అందరి ప్రేమాభి మానములనందుకొంటూ సాహిత్య సాంస్కృతిక రంగాలలో ముందుకేగ ప్రయత్నిస్తుంటాను

—ఎర్రోజు సత్యం

## 1. జే జే లు.

జన్మను ఇచ్చి
చల్లగ పెంచే—
తల్లి దండ్రులకు జేజేలు

విద్యను చెప్పి
బుద్ధులు నేర్పే—
గురువు గారికి జేజేలు!

కష్ట సుఖాలలో కాపాడేటి—
భగవంతునికి జేజేలు!

## చల్లనైన పిల్లలం

పిల్లలం పిల్లలం
చల్లనైన పిల్లలం
కల్ల కపట మెరుగని
తెల్లనైన మల్లెలం

నేడు మేము పిల్లలం
రేపు భావి పౌరులం
దేశానికి అవుతాము
వెలుగునిచ్చె దివ్వెలం

ఎర్రోజు సత్యం

## 3. కలెక్టరునై పోతాను.

చందమామ చందమామ చల్లంగరావె
పక్కని నాకథ సరదాగ వినవే
తరగతిలోన ఫస్టుగ వస్తే—
గురువు నాకు ప్రైజునిచ్చె
ప్రైజ్‌ను నేను నాన్నకిస్తే—
నాన్నా నాకు డబ్బానిచ్చె
డబ్బును నేను అమ్మాకిస్తే—
అమ్మా నాకు లడ్డూనిచ్చె
లడ్డు నేను అన్నాకిస్తే—
అన్న నాకు నేపూనిచ్చె
నేపు నేను అక్కాకిస్తే—
అక్కా నాకు అటుకులనిచ్చె
అటుకులా నేను వదినేకిస్తే
వదిన నాకు వెన్నా నిచ్చె
వెన్నా నేను కోమటికిస్తే—
కోమటి నాకు కొబ్బరి నిచ్చె
కొబ్బరి నేను దేవుడికిస్తే—
దేవుడు నాకు తెలివిని యిచ్చె
తెలివితొ నేను బాగా చదివి
కలెక్టరునై పోతాను
ప్రజలకు సేవా చేస్తాను

## 4. ఒకటి రెండు అందాము

ఒకటి-రెండు అందాము
ఓపికతో మనముందాము
మూడు-నాలుగు అందాము
ముద్దుల నొలుకుతు ఉందాము
ఐదు-ఆరు అందాము
ఐకమత్యముతొ ఉందాము
ఏడు-ఎనమిది అందాము
కీడు చేయక ఉందాము
తొమ్మిది-పది అందాము
అమ్మ మాటలను వింతాము.

## 5. మర్యాదగా మాట్లాడుట

మనకన్నా పెద్దలనూ
అన్నా అక్కా అంటూ—
మనకన్నా చిన్నలను
తమ్మి చెల్లీ అంటూ—
మర్యాదగా పిలువాలి
మన్ననలను పొందాలి.
మర్యాదగ మాట్లాడుట
మనిషికెంతొ ముఖ్యము
మర్యాదగ పలుకకుంటె
కలుగునెంతొ అగౌరవము.

## పరమాత్ముని ప్రేమను పొందాలి

ఎండలు బాగా కాయలీ
వానలు బాగా కురవాలి.
వానలు బాగా కురియాలీ.
చెరువులు నిండుగ నిండాలి.
చెరువులు నిండుగ నిండాలీ
పంటలు మెండుగ పండాలి.
పంటలు మెండుగ పండాలీ
ప్రజలు సుఖముతో ఉండాలి.
ప్రజలు సుఖముతో ఉండాలీ
శక్తిని యుక్తిని పెంచాలి.
శక్తిని యుక్తిని పెంచాలీ
ప్రగతినినెంతో సాధించాలి.
ప్రగతినెంతో సాధించాలీ
మంచితనమును పెంచాలి.
మంచితనమును పెంచాలీ
పరమాత్ముని ప్రేమను పొందాలి,

## 7. మనిషి పుట్టినది ఎందుకురా?

మనిషి పుట్టినది ఎందుకురా?
మంచిని పెంచేటందుకురా!
మంచిని పెంచే దెందుకురా?
అందరు సుఖపడె టందుకురా!
అందరు సుఖపడు టెందుకురా?
దేవుని కొలచే టందుకురా!
దేవుని కొలచే దెందుకురా?
పుణ్యము పొందే టందుకురా!
పుణ్యము పొందే దెందుకురా?
ముక్తిని పొందే టందుకురో!

## 8. బడి

బడి అంటేనే భయపడను
బడి అంటే అది ఇల్లువంటిది
గురువంటేనే బెదిరిపోను గురువు తండ్రిలాంటివాడు
ఆనందంగా బడికి పోయెదను
చనువుగ గురువుతో మెదిలెదను
పాఠాలన్ని మంచిగ నేర్చి విజ్ఞానమును పొందెదను
ఆట పాటలతో ముద్దుగ గడిపి
హాయిగ ఇల్లును చేరెదను
బడిని తలచుకొని మురిసెదను
ప్రేమతో బడికి పోయెదను.

## 9. గాంధీతాత

గాంధితాత మహాత్ముడు
ఎలా ఎలా అయ్యాడు
అందరిచే మన్ననలను
ఎలా అందుకున్నాడు?
అందరి సుఖమును కోరి
గాంధితాత బ్రతికాడు సత్యమునే పలికాడు
స్వార్థాన్ని వదిలాడు.
దీనుల పాలిటి అతడు
దేవునివలె మెదిలాడు
దేశంకోసం సర్వం
ధారపోసి నడిచాడు కోపాన్ని వదిలాడు
శాంతి బాట నడచాడు
మంచి మంచి గుణాలతో
మంచితనం పెంచాడు.
అందుకనే గాంధితాత
మహాత్ముడు అయ్యాడు
అందరిచే మన్ననలను
సదా అందుకుంటాడు.
గాంధితాత గుణాలను
మనము నేర్చుకోవాలి
అందరి మెప్పును పొందుచు
ముందడుగు వేయాలి.

# 10. పొదుపు

అమ్మా నాన్న ఇచ్చిన డబ్బులు
బంధువులొస్తె ఇచ్చిన డబ్బులు
గోలీలకు బిస్కట్లకు
దుబార ఖర్చులు చెయ్యొద్దు
కూడబెట్టుకోనుటే ముద్దు
చిన్నలైనా పెద్దలైనా
పొదుపు చేయుటను నేర్వాలి
పెద్ద మొత్తమును పొందాలి.
చిన్న చిన్నగా చేసిన పొదుపే
పెద్ద మొత్తమై పోతుంది
అవసరాలను తీర్చుతుంది

అందుకని మరి అందుకనీ
సంపాదించుట ఎంతముఖ్యమో
పొదుపు చేయుట అంతముఖ్యము
దుబార ఖర్చులు చెయ్యొద్దు
పొదుపు చేయుటను మరువద్దు.

## 11. మంచి నడవడి.

అమ్మా నాన్న చెప్పిన పనులను
ఆనందంతో చేస్తాను
పెద్దలు చెప్పిన మంచి మాటలను
శ్రద్ధతో నేను వింటాను
గురువు చెప్పిన పాఠాలన్ని
మరువక మరి మరి చదివెదను
మంచి నడవడి నేర్చుకొని
మంచి పేరును పొందెదను.

## 12. మంచితనం పెంచాలి.

అనాలీ అనాలీ
మంచి మాటలనాలి
వినాలీ వినాలీ
మంచి మాటలినాలి
చూడాలి చూడాలీ
మంచినీ చూడాలి
పొందాలీ పొందాలీ
మంచిగుణం పొందాలి
చేయాలి చేయాలీ
మంచి పనులు చేయాలి
పెంచాలి పెంచాలి
మంచితనం పెంచాలి.

## 13. ఉల్లిగడ్డంత

అయ్యగారేమో ఉల్లి గడ్డంత!
అయ్యగారి పెండ్లాం పెద్ద ఏనుగంత!!
ఈవింత జంటను చూడగవోతె—
ముంతవాయెరా ముత్తయ్యా!
ముత్తయ్యతో నేజెప్పుతుంటే—
చెంబువాయెరా చెంద్రయ్యా!
చెందర్యయ్యతో నేజెప్పుతుంటె
గ్లాసువాయెరా గంగయ్యా!
గంగయ్యతో నేజెప్పుతుంటే—
గిన్నెవాయెరా చెన్నయ్యా!
చెన్నయ్యతో నేజెప్పుతుంటే—
లాగువాయెరా అన్నయ్యా!
అన్నయ్యతో నేజెప్పుతుంటే—
అంగివాయెరా లింగయ్యా!
అన్ని వోతయని ఇంట్లో ఉంటే—
ఉన్నవి దక్కెర ఊశయ్యా!

## 14. పండిత నెహ్రూ

పండిత నెహ్రూ పుట్టిన రోజు
బాల బాలికల పండుగ రోజు
భారతదేశం మురిసిన రోజు
దేవుడు సంతోషించిన రోజు పం.

పద్దెనిమిదివందల ఎనుభై తొమ్మిదవ సంవత్సరము
నవంబరు పదునాల్గవ తేది అలహాబాదు నగరమున
స్వరూపరాణీ మోతిలాల్‌లకు
చక్కని జాబిలివలె జన్మించెను పం.

గులాబిలాంటి చక్కని మనసుతో
జిలేబిలాంటి తీయని మమతతో
బాల బాలికల ప్రేమించాడు
బాలల చాచగ వెలుగొందాడు పం.

భరతదేశముకు స్వాతంత్ర్యమును
సంపాదించగ తలచాడు
గాంధితాతకు ముఖ్య శిష్యుడై
స్వాతంత్ర్యము సాధించాడు పం.

ప్రధాన మంత్రిగ మనదేశానికి
పదునేడేండ్లు పనిచేశాడు
"భారతరత్న"గ కీర్తిని పొంది
"శాంతిదూత"గా వెలిగాడు పం.

పండిత నెహ్రూ నడచిన బాటలో
మనమందరము నడవాలి
పగలూరేయి పరిశ్రమిస్తూ
దేశ ప్రగతి సాధించాలి
పండిత నెహ్రూకు జేజేలు అందించుదాం పదివేలు

## 15. ఏమిచేయుచుంటివి?

ఏమి చేయుచుంటివి?
పాట పాడుచుంటిని.
ఏమి పాట-మంచిపాట
ఏమి మంచి-మాటమంచి
ఏమిమాట-నీతిమాట
ఏమినీతి-నడకనీతి
ఏమి నడక-గొప్ప నడక
ఏమి గొప్ప-సేవ గొప్ప
ఏమి సేవ-దేశసేవ.

## 16. సెలవులు-వస్తే—

సెలవులు వచ్చాయంటే చాలు
చలపతి ఎప్పుడు ఆటలాడును
సోమరిపోతై తిరుగుచుండును
చదువు సంధ్యలను మరచిపోవును
పాఠశాలలు తెరచేవరకు
పాఠాలన్నీ మరచిపోవును
మొద్దబ్బాయిగ మిగిలిపోవును
అందరిలోన చులకన పొందును
అందుకన్ని మరి అందుకనీ
సెలవు రోజులలో పాఠాలన్నీ
శ్రద్ధతో చదువుచు ఉండాలి
సాయంత్రము తగిన వేళలో
ఆటలు మంచివి ఆడాలి.

## 17. బొజ్జబావ!

బావా! బావా! ఓ బావా!!
బొర్రను గలిగిన మా బావా!
ఎత్తుగ ఉన్న నీబొజ్జ
ఎంతో ముద్దుగ ఉంటుంది
కాగుల ఉన్న నీ బొర్రి
కనులకు పిందు కలిగిస్తుంది
నీవు నవ్వితె ఓ బావా
బొర్రి ముద్దుగా ఊగేను
నీవు నడిచితే ఓ బావా
బొర్రి ముద్దుగా కదిలేను
నీ బొర్రి క్రింద ఓ బావా
చక్కగ గుడిసె వేయొచ్చు
నీ బొర్రి క్రింద ఓ బావా
హాయిగ కాపురముండచ్చు
బావా బావా ఓ బావా
బొర్రను గలిగిన మా బావా
ఎండలు బాగా కాస్తున్నాయి
నా తల మాడి పోయెను బావా
బొర్రి బావ బొర్రి బావ బొర్రి బావా
రావా రావా ఇటురావా
నీ బొర్ర క్రింద నిల్చొని ఉంటే
ఎండ నుండి రక్షణ కలిగేను
ఎంతో చల్లగ ఉండేను
బొర్రి బావ బొర్ర బావ బొర్ర బావా!
రావా రావా ఇటు రావా!

## 18. చదువాలి చదువాలి

చదువాలి చదువాలి
గొప్పవారి చరిత్రలను
తప్పకుండ చదువాలి
వారిలోని మంచిగుణం
మనం నేర్చుకోవాలి
మనం కూడ మంచి చేస్తు
మహాత్ములము కావాలి
దేశసేవ చేయాలి.

## 19. చెమ్మ చెక్క!

చెమ్మ చెక్క–వినవే అక్కా
గుడిలో గంటలు మ్రోగంగా
భజనలు బాగా జరుగంగా
ఊరికి క్షేమం కలుగంగా
అందరు హాయిగ ఉండంగా
ఆటలనాడుకుందాము
పాటలు పాడుతు ఉందాము
గుడిలోకెళ్ళి వద్దాము
దేవుని పూజలు చేద్దాము
మంచిని పెంచుతు ఉందాము
మానవ సేవ చేద్దాము

## 20. చెప్పర రంగా!

కాళ్ళగజ్జె—పూలసజ్జె
నేనడుగంగా—చెప్పర రంగా!
కోడిగాని కోడి ఏంకోడి ఏంకోడి?
పకోడి, పకోడి!!
బడికాని బడి ఏబడి ఏబడి?
రాబడి రాబడి!
నదికాని నది ఏనది ఏనది?
ఐనది ఐనది!
పాటుగాని పాటు ఏపాటు ఏపాటు?
సాపాటు సాపాటు!
కలముగాని కలమేకలము ఏకలము?
సకలము సకలము!
మాటగాని మాట ఏమాట ఏమాట?
టమాట టమాట!
రాయిగాని రాయి ఏరాయి ఏరాయి?
సురాయి సురాయి!
ఇకచాల్లోయి చాల్లోయి
పదవోయి పదవోయి.



: రచయిత :

ఎర్రోజు సత్యం

జననం : 6-7-1947

జన్మస్థలం : చీర్లవంచ
తా. వేములవాడ
జి. కరీంనగర్

వృత్తి : అధ్యాపకత్వం

అభిరుచులు : సాహిత్య సాంస్కృతిక రంగాలు

ముద్రితములు. 1 పిల్లల పాటలు మొదటి భాగం 2 బాలలోకం
3 పిల్లల పాటలు రెండవ భాగం

అముద్రితములు: 1 మూడు కుటుంబాలు (సాంఘిక నవల)
2 భర్తను దిద్దిన భార్య ( ,, )
3 సమసమాజం (వచన కవితా సంపుటి)
4 లెమ్ము లెమ్ము సోదర (గేయసంపుటి)
5 నీవూ! నేనూ! గేయఖండకావ్యం
6 పిల్లల పాటలు 3వ భాగం 7 తాతయ్య చెప్పిన నీతి కథలు 8 ఆచరించి చెప్పాలి (నాటిక)
9 తెలుసుకున్న నిజం (బుర్రకథ) 10 మంగళ హారతి పాటలు 11 ఆలుమగలు (కథల సంపుటి)
ఆలిండియా రేడియో ద్వారా, పలు పత్రికల ద్వారా తెలుగు శ్రోతలకు, పాఠకులకు కవిగా కథకునిగా సుపరిచితులు